

విదుషివగుట నీకు వేడుకజనియించెఁ
గావ్యకన్యనిట్లు గౌరవింప
నాంధ్ర సతులకెల్ల నాదర్శమయ్యె నీ
భావ శోభ రామబాణమాంబ!

- బేతపూడి ఈశ్వరాచారి





ద్రవ్యదాత్రి

శ్రీ శ్రీ పద్యాల వేంకటేశ్వరులుగారి ధర్మపత్ని

చి॥ సౌ॥ రామబాబమ్మ

# భారతగానము

శ్రీః

## ఆశీస్సు

ద్వి. దానకల్పకవల్లి ! తరుణీమతల్లి !
మానితమృదుపాణి ! మకరందవాణి !
సుమతి ! ముద్దులగుమ్మ, సుగుణాలబొమ్మ !
రమణిరో! పద్యాలరామబాణమ్మ !
పరమపావనులైన . పాండురాట్సుతుల
చరితంబు సకలార్థసంధాయకంబు
ఆదిదేవుండైన హరికంకితముగ
మోదంబుతో నేను ముచ్చటించెదను
తల్లిరోయిది మహాధర్మవేదంబు
చెల్లెలావిననీవు సిద్ధార్థవగుచుఁ

జిన్నమామిడిచెట్టు చిగిరించినట్లు
పున్నమవెన్నెల పొలుపారినట్లు

నిండారఁజూచిన నెత్తమ్మిపగిదిఁ
బండిన కేదారభాగంబురీతి

ననలఁబిండెలతోడ నలరారునట్టి
గొనబుదోసలతోఁటకునుసాటిగాఁగ

జూచువారికినెల్లఁజోద్యమానట్టు
లా చంద్రతారార్కమగు కీర్తితోడఁ

బతితోడ సుతులతో భాగ్యాలతోడ
సతత వైభవభోగ సంపత్తితోడఁ

బట్టిన యదియెల్ల బంగారుగాగ
ముట్టినయది మంచి ముత్యంబుగాగ

రాముని వరకృపా రసముచే సీవు
భూమిపైఁబెక్కేండ్లు పొలుపారవమ్మ.

# భారతగానము

## ఆదిపర్వము

జేజేమంగళనామ! జేజేసాగరధామ!
జేజేరమారామ! జేజేయాదవసోమ!

మునిచంద్రుఁడగువ్యాసు ముదమునఁగొనియాడి
జనకు వేంకటదాసు సన్నుతిఁ గావించి
మాచెల్లెలీగేయ మహితచరిత్రంబు
యాచింప వ్రాసితి నవధరింపుమయ్య

ఇందు వంశోద్భవులిల యెల్లశాసించి
బందుగుల్ కౌరవ పాండవులేలిరి.

జ్ఞాతివైరముఁ బూని కలుచ సుయోధనుఁ
డాతత ధర్మాత్ములగు పాండుపుత్రులఁ
గ్రూరుఁడై బాధించె గుణగరిష్ఠుఁ వారి
వారణాసికిఁబంపి వంచనమొప్పఁగ

లక్కయింటనుంచి లలిఁగాలిపించెను
జిక్కకనీదయ శ్రీకాంత! వారలు

ప్రాకటముగురీతి బ్రాహ్మణవేషాల
నేకచక్రపురికి నేగిరచ్చోటను

భీముఁడువధియించె భీకరబలు, బక
నామకదైత్యు నానందింపఁ బౌరులు

ఉత్తరకాంపిల్య మొప్పఁబాలించు రా
జోత్తముఁ డాత్మజ కుంకువగాగను

మింటఁగట్టినయట్టి మీనయంత్రంబును
వింటభేదించి దోర్వీర్యమెలర్పఁగఁ

గొనివచ్చెఁబార్థుఁడు కోమలి ద్రౌపది
జనవరులందఱు సాధ్వసమందగ

నంచితంబుగ నామెఁ బంచపాండవులును
గొంచక గైకొనిరి కులధర్మపత్నిగ

నింద్రప్రస్థంబున నెలమితో కలిమితో
సాంద్రభోగములతో సౌఖ్యముతోనుండి

యనుజులు దిశలెల్ల నర్మిలి నిర్జించి
ధనములుగొని తేర ధర్మజుఁడంతట

రాజసూయము సేసె రాజలలాములు
భూజనులాశ్చర్యమును బొందనప్పుడె

యగ్రపూజకు నీవ నర్హుఁడవనిపల్కు
నుగ్రుని శిశుపాలు నుక్కడఁగింపవె ॥ జేజే ॥

ఆదిపర్వము సమాప్తము



# భారతగానము

## సభాపర్వము

రాజసూయావసరమునందుఁ బాండవులు
రాజులచే నొందు ప్రాభవంబును గాంచి
మదినోర్వలేక యే మాడ్కినైనను వీరి
సదమద మొనరించి సాధింతుఁ బొమ్మంచుఁ

బూని సుయోధన భూమిపాలకుఁ డంతఁ
గానీన యువరాజ గాంధార రాజులఁ
గూడి యాలోచించి కుటిలత విదురుని
వేఁడి యుధిష్ఠిరు వేగమె పిలిపించి

మాయ జూదంబాడి మహియెల్లఁ గైకొని
పాయక ద్రౌపది వస్త్రములొలిపింప

నాకృష్ణ హాకృష్ణ యని నిన్నుఁ బ్రార్థింపఁ
గోకులక్షయముగఁ గోపతికీయవె

గ్రుడ్డిరాజంతటఁ గోడలిఁబిలిపించి
దొడ్డతనంబున దుఃఖించి యామెకు

నోడిన రాజ్యంబు నూఁకొని యిచ్చె నీ
వోడకుమని చెప్పి యోదార్చి కరుణతో

మఱల జూదంబాడి మాయావిధంబునఁ
దఱిమి యోడించెను ధర్మజు రారాజు

ఓడిన వారలు పోడిమిఁ బదియు రెం
డేఁడులు వనినుండి యిఁక నొక్కవర్షంబు

వరుసగ నజ్ఞాత వాసంబుఁబురమునఁ
బరగించునట్లుగ పణమొడంబడు జేసి

తమ్ములతోడను ద్రౌపదితోడ వ
నమ్ములనుండఁగ నడచె ధర్మజుండు॥

పార్థులంతటి దైవ పౌరుషవంతులు
వ్యర్థులై రాజ్యసంపద లెల్లఁగోల్పోయి

కానల కేగిరి గానని౦కెవ్వారి
చేసగు విధి(వ్రాలుఁ జలఁగి దాఁటిపోవ

వెన్నుఁడ! విధియన వేఱొక్కరుండె నీ
కన్నఁ (బపంచైక కర్తవీవెగాద ॥జేజే॥

సభాపర్వము ముగిసెను



# భారతగానము

## ఆరణ్యపర్వము

ఆరీతిఁబాండవు లడవులబడిఁబోయి
ఘోరకష్టంబులఁ గుందుచునుండియుఁ

బుణ్యా మౌనులవలనఁ బూర్వచరిత్రల
గణ్యంబుగావిని క్రతువులు సేసిరి

ఇంద్రకీలంబున నింద్రకుమారుఁడు
సాంద్రతపంబున శంభుని మెప్పించి

పాశుపతాస్త్రంబుఁ బడసెను బిదప నా
కేశుని నగరికి నేగియచ్చోటను

దేవసాధ్యులుగాని దితిజులనిర్జించి
పావనదివ్యాస్త్ర పటలిసంపాదించె

ద్రుపదనందనగోరఁ దోడనేభీముఁడు
కపినాథు మారుతి కారుణ్యమునుబొంది
యక్షలోకంబున కరిగి వారలనెల్ల
శిక్షించిగొనివచ్చెఁ జెలఁగి పుష్పమ్మును
క్షితిసురుచరణికై జతనంబుఁగావించి
గతిలేకపడియున్న ఘనులఁదమ్ములఁజూచి
వగఁజెంది ధర్ముని ప్రశ్నంబులకు నెల్లఁ
దగునుత్తరములిచ్చె ధర్మరాజంతట
దానికిహర్షించి ధర్ముఁడు కరుణించె
మానవనాథుని మఱియుసోదరులను "జేజే"

అరణ్యపర్వము సమాప్తము



# భారతగానము

## విరాటపర్వము

ఆరణ్యవాసంబు నంతంబుగావించి
మాఱువేషంబుల మత్స్యదేశమునందుఁ

గౌంతేయులుండఁ ద త్కాంతనుగామించి
యంతకుసన్నిధి కరిగెసింహబలుఁడు

గంధర్వపతియన్న కావట్యమునుబెట్టి
గంధవాహసుతుఁడు ఖండించెఁగీచకు

ఆమాటవిని పార్థు లచ్చటఁగలరని
పామరుల్ కౌరవ పతులుబట్టఁగగోరి

పోసఁగ దక్షిణమందుఁ బోదలుమత్స్యేశుని
పసులగ్రహింపఁగఁ బాపి సుశర్మనిఁ

బనుపఁగ నాతఁడు పశువులవిరటునిఁ
గొనిపోవుచుండఁగఁ గోపించిపార్థుండు
తక్కఁదక్కినపాండు ధరణీంద్రపుత్రకు
లుక్కున మహినాథు గ్రక్కునవిడిపించి
రుత్తర గోగ్రహణ మత్తఱిఁగౌరవుల్
మత్తులై సేయంగ నుత్తరుతోడను
జనియర్జునుఁడు కురు సైన్యము నిర్జించి
ఘనకీర్తితోడ నాఁ గదుపులమఱలించెఁ
గన్యనుత్తర నభి మన్యునకిచ్చి సౌ
జన్యముతోఁ బెండ్లి సలిపెవిరాటుండు ॥జేజే॥

విరాటపర్వము సంపూర్ణము



# భారతగానము

## ఉద్యోగపర్వము

ఆరణ్యవాసంబు నజ్ఞాతవాసంబు
నీరీతి ముగియించి యెలమితోఁ బార్థులు

యుద్ధ సన్నాహంబు నొనరించుచుండ స
న్నద్ధులై మేదిని నాథులు వారికి

నరుదెంచిరొక్క యే డక్షోహిణులసేన
లరసి కొల్వఁగ నింక నచ్చటఁ గురురాజు

పక్షానఁజేరిరి పార్థివుల్ పదునొకం
డక్షౌహిణులసేన లార్భటమొనరింప

నంతట ధర్మజుఁ డర్థాంబుఁదలపోసి
కంతుజనక ! నిన్నుఁ గౌరవసభకును

ప్రార్థించి సంధికై పనుపఁగ నీవు త
దర్థము జనియట ననువుగఁ దెల్పవె
నీమాటవినకయె నీచు సుయోధనుఁ
డామున నినుఁగట్టి నాత్మలోఁదలపోయ
విశ్వరూపముఁజూపి వెగడుపడంజేసి
విశ్వేశరావెమున్ విరటునిపురికిని
పాండవభాగంబుఁ బంచియీయకయిట్లు
మొండియైహరియించె మూర్ఖుఁడుకురురాజు. ॥ జేజే॥

ఉద్యోగపర్వము ముగిసెను



# భారతగానము

## భీష్మపర్వము

కౌరవపాండవుల్ కదనమొనర్పఁగఁ
జేరిరి వరకురు క్షేత్రంబునందున

గాండీవిబంధుల ఖండింపఁగాలేక
భండనంబునుమానఁ బరమేశనీవంత

వానికిబోధించు వ్యాజంబునను లోక
మానితమగు గీతఁ బూని వచింపవె

మందాకినీపుత్రు మహితబలంబునఁ
గొందలమందక కురురాజుసైన్యంబు

చెలరేఁగెఁ బాండవ సేనలు డీకొనెఁ
బ్రళయముయ్యెనుబోరు వారికి వీరికి

రక్తనదులువారె రథములు పొడియయ్యె
శక్తిమంతంబులు సామజంబులుసచ్చె
గుఱ్ఱములు కాల్బలము గూలెనుబీన్గుల
వఱ్ఱయ్యె మేదిని పదిరోజులీరీతి
నరిసేన నలయించి యస్తమించెను భీష్మ
ఖరకిరణుండంతఁ గాలవశుండయి ॥ జేజే॥

భీష్మపర్వము సమాప్తము

# భారతగానము

## ద్రోణపర్వము

అంతట నాచార్యు నధిపతిగాఁగొని
సంతోషమునఁగురు సైన్యము వెడలెను

బద్మవ్యూహంబును బన్నె గురుఁడు నాక
సద్మలు మెచ్చఁగఁ జాతుర్యమొప్పార

కవ్వడి లేడటఁ గారణాంతరమున
నెవ్వడిఁబరు లెవరు నేరకైరిచొఱ

నంతటనభిమన్యుఁ డడరి నిర్భేదించి
దంతినాథుఁడుమడువు ధట్టించుపోలిక

నొడ్డెల్లఁ గలవర మొందించి భ్రమించి
యడ్డుపడినవారి హతులనుగావించి

కౌరవనాథుల కపటోపాయంబున
ధారిణిఁగూలెనా ధైర్యగరిష్ఠుఁడు

వానిమరణమునకు వాసవికోపించి
పూనెఁ బ్రతిజ్ఞను ఘోర సైంధవుఁజంప

నామఱుదినమున నాచార్యుఁడధికమౌ
సామర్థ్యమునఁబన్నె శకటవ్యూహంబును

మేటిమగలు రాజ కోటులు సైంధవుఁ
బాటించి కావఁగఁ బట్టువట్టినఁగాని

సారథివైయుండి సవ్యసాచిచేత
నారోజుననెవాని నడరిచంపింపవె

నీవుతలంచిన నిఖిలలోకారాధ్య!
భావింపనెంతటి పనియైనఁజెల్లదె

ద్రోణుఁడిట్టులైదు రోజులుయుద్ధంబు
రాణనొనర్చి ధరాస్థలికొఱగెను

ద్రోణపర్వము ముగిసెను



# భారతగానము

## కర్ణపర్వము

కర్ణునిఁగావించెఁ గౌరవ్యరాజంత
వర్ణించి సైన్యాధి పతిగనతండును

మండువైశ్వానరు మాడ్కినిఁజెలరేఁగి
పాండవ సేనలఁ బాడొనరించెను

గ్రమ్మిదుశ్శాసను ఱొమ్మునుభేదించి
యమ్మరుదాత్మజుఁ డానెరక్తఁబును

రెండుఁరోజులు మహో ద్దండతశత్రుల
ఖండించివీరులఁ గలఁతపడంజేసి

పరగబ్రాహ్మణశాప బలమునరథచక్ర
మిరుసుమోవఁగధాత్రి బెరసిగ్రుంగిపోవ

నరునిబాణావళి కెరయయ్యెఁగర్ణుఁడు
కురుపతికన్నులఁ గురిసెబాష్పంబులు ॥ జేజే॥

కర్ణపర్వము సమాప్తము

# భారతగానము

## శల్యపర్వము

బలవంతుఁడగు మద్ర పతిప్రాపునం జేసి
నిలిచి కౌరవసేన కలఁచిపోరాడెను

ఒక్క పూట యుద్ధ మొనరించి శల్యుఁడు
స్రుక్కి చచ్చెను ధర్మ సుతునితోఁ బోరాడి

మాద్రేయునిర్ముక్త మార్గణంబుల దీర్ఘ
నిద్రఁజెందెను శకుని నియతివశంబున

దండనాథులు బంధు ధాత్రీపాలకులు వే
దండచయంబు లు ద్దండాశ్వదళములు

సకలసైన్యములిట్లు సర్వమంగళమైన
వెకలియా, కురురాజు భీతిల్లియుంతట

పాఱిమడుపునడాగఁ  బాండవులారసి

క్రూరవాక్యంబులఁ  గోపంబుఁదెప్పింప

మడుపు వెడలివచ్చి  మానిసుయోధనుఁడు

కడఁగిభీమునితోడఁ  గదనంబుఁగావించె

నూరులు విఱిగినఁ గౌరవనాథుండు

ధారిణిఁద్రెల్లైను దనపాపబలమున   ॥జే జే॥

శల్యపర్వము సంపూర్ణము



# భారతగానము

## సౌప్తికపర్వము

ఆరాత్రి రారాజు నానతిఁగొనివచ్చి
క్రూరుఁడశ్వత్థామ కుటిలభావుండగుచుఁ
గౌంతేయశిబిరముల గాలించి నిద్రించు
కుంతీపౌత్రులనింకఁ గువలయాధీశులఁ
బాంచాలపుత్రుల వంచించి వధియించెఁ
గొంచెమైనసేన కొఱవడకుండఁగ
నారేయియచ్చట ననఘులుపాండవుల్
శ్రీరమణ, నీవును లేకుంటనట్లయ్యెఁ
గౌరవేశ్వరుఁజంపఁ గావఁగసముకట్టి
ధారిణీతలమునఁ దనరారుచున్నట్టి

రాజసైన్యంబులు రాజబృందరంబులు
నోజఃబడునెనిమిది రోజులలోపల
నని హతాహతమయ్యె నారీతినొకచోట
మునుద్వాపరంబున ననఘువరంధామ!
అందులకేగద యవతరించితివప్పు
డింíదిర రమణ గోవింద జనార్దన ॥జేజే॥

సౌప్తికపర్వము సమాప్తము



# భారతగానము

## స్త్రీపర్వము

కొడుకులమృతివిని గ్రుడ్డిరాజంతట
నడలుచు భార్యతో నవరోధజనముతోఁ
గదలివచ్చెను బోలి కలనికి నచ్చోట
రోదనేయువనితల రోదననాదముల్
వినిదుఃఖితాత్ముఁడై మనమునధర్మజుఁడు
తనకులధర్మంబుఁ దడయ కేవగించి
చితులనుజేర్పించి —క్షితిపతులకునెల్ల
నతులితంబుగఁజేసె నగ్నిసంస్కారముల్
గంగాతరంగిణిఁ గౌరవులకునెల్ల
సంగతిగాఁజేసి సలిలప్రదానంబు
నందవ గాహించి యిందువంశోద్భవుఁడు
బందుగులతోడను బరిశుద్ధుఁడాయెను ॥ జేజే॥

స్త్రీపర్వము సమాప్తము

# భారతగానము

## శాంతిపర్వము

కరిపురంబున కంతఁ బరివారములతోడ
నరిగి యచ్చట బంధు మరణాతురుండయ్యెఁ

బుడమిఁబాలించుట కొడఁబడకూరక
యడలు ధర్మజునకు ననువుగబోధించి

మంచిలగ్నమునందు మాన్యులతోడఁ బ్ర
పంచమునకునెల్లఁ బట్టముఁగట్టవె

ఛెలువుగఁబట్టాభి షిక్తుఁడై యీవిధిఁ
దులలేని విభవంబుతో ధర్మపుత్రుఁడు

తమ్ములతోఁగూడి ధాత్రిఁబాలించుచు
సమ్మతినుండెను సౌఖ్యంబుతోనిట్లు

వర దాశరథిసూరి వ్రాసి పూడివాడ
హరిపాదయుగళికి నర్పించుకొన్న యీ
భారతగానంబుఁ బఠియించువారికి
నారోగ్యభాగ్యంబు లక్షయసుఖములు
ధరణిలోసమకూడుఁ దనువుఁబాసినయంతఁ
బరమపదంబును బ్రాప్తించుసత్యము ॥జేజే॥

భారతగానము సర్వము సంపూర్ణము

కృష్ణార్పణమస్తు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

❀★❀

# మంగళహారతి

హారతిఁ గైకొనుమా అంబ సావిత్రీనీవు; అనుమాదిరి

ప. హారతి యిచ్చెదరా అంగజజనకాయిదె
అ. ధారుణిమనుముఁ బ్రోవఁగా దైవమునీవేయని ॥హా॥

చ. గాసిఁజెంది దంతిరాజు కావవేయనివేఁడఁగా
వాసవాది దేవగణములు వందనంబులుసేయగా
భాసురంబుగ నేగిమకరినిఁబట్టి వేగమె రెండుగాఁ
జేసి యేలినవాఁడవని జేరి నీకు మంగళ ॥హా॥

నిండుకొలువునభంగమొంది నీరజాక్షి రావెరా
అండజేంద్రయాన ! నే నీ యాపద పడఁజాలరా
దండమనుచుఁ బల్కనా మొఱఁదక్కవించుకయైనరా
కుండ నరసినయార్తబాంధవుండవనికర్పూరమిళిత ॥హా॥

పూడివాడ వాస యదుకులభూషణాఖిలశోషణా
వేడుకనీపాదముల వినుతిఁజేసి భక్తితో ॥హా॥

# జోలపాట

జో అచ్యుతానంత జో జో ముకుందా రార పరమానంద రామ
గోవింద; అనుమాదిరి.

ప. జోకృష్ణ ! యదుబాల ! జోజోసుచేలా !
జోచంద్రరవినయన ! జోభోగిశయనా! ॥జోజో॥

చ. నిదురబోనాతండ్రి ! నిదురబోవయ్యా !
నిదురబో లోకేశ ! యిదెవచ్చెరాత్రి! ॥ ॥

చీఁకటివిరియించెఁ జిన్నిజాబిల్లి
ఆకసంబునఁజుక్క లలరారెనవిగో ॥ ॥

పసిఁడియుయ్యేలలోఁ బవళించినీవు
నిసుఁగువై కనుమూసి నిద్రించవయ్యా ॥ ॥

చెలఁగి సోమకుఁజంపఁ జేపరూపొంది
ప్రళయవారిధిసీఁది బడలిపోయితివి ॥ ॥

బృందారకులకొఱకు మందరంబెత్తి
సుందరకూర్మమై సొలసిపోయితివి ॥ ॥

తొలుపందివై యసురఁ ద్రొక్కిగీటాడి
యిలపైకినెత్తిన జలజపత్రాక్ష ! ॥ ॥

నీసువుఁ బ్రోవఁగ మర్త్యసింహరూపమున  
నసురనాయకుఁ జంపి యలసినతండ్రి ॥జోజో॥

వక్షమున సిరిగల్గువాఁడవై యుండి  
భిక్షమెత్తినయట్టి పిన్నబ్రాహ్మణుఁడ ॥ ,,

మదమత్తులై యున్న మానవేశ్వరుల  
వెదకి ఖండించిన విశ్వలోకేశ ! ॥ ,,

రామచంద్రుండవై రావణునిఁద్రుంచ  
భూమి నాయాసంబుఁ బొందినావయ్యా ॥ ,,

వ్రేపల్లెలోనిపుడు గోపకాంతలను  
చేపట్టిరక్షించు చిన్నికృష్ణయ్యా ॥ ,,

ఇలఁబూడిపాఁడలో నెలమిమీఱఁగను  
వెలసియున్నట్టి శ్రీ వేణుగోపాల ॥ ,,

నిదురబో నాతండ్రి నిదురబోవయ్యా  
నిదురబో సుకుమార నిశివచ్చెఁగాన॥ ॥జోజో॥



# మేలుకొలుపు

"గుమ్మఁడేడే గోపిదేవి వలె"

మేలుకొనరా బాలకృష్ణా మేలుకొనరా మదనరూపా
మేలుకోవయ్యా కృష్ణయ్యా ।మేలుకో।
తెల్లవాఱెను గొల్లభామలు చల్లఁజేసిరి వెన్నముద్దలు
కొల్లలాడఁగ వేళయయ్యె మేలుకో కృష్ణానీవు ॥మేలుకో॥
కడుపులోనున్నట్టి జగములఁ గన్న తల్లికి నోరుఁదెఱచి
గ్రక్కునఁ జూపింపనీవు ॥మేలుకో॥
బాలకులతోఁగూడి వేగమె యాలమందల మేపనడవికిఁ
బోలుకొని పోవంగవలయు ॥మేలుకో॥
రాలవాన గురియసాగెను దాళఁజాలరు గోపకులు నీ
కేల గోవర్ధనము నెత్త ॥మేలుకో॥
తీరుగా యమునాస్రవంతీ తీరమున గోపాలబాలల చీర
లున్నవి దొంగిలింప ॥మేలుకో॥

పున్నమవెన్నెల వచ్చెను బొన్నమ్రాని మీఁదనెక్కి
తిన్నఁగా వేణువునునూద ॥మేలుకో॥

గోపికామహిళామతల్లులు గుంపులైవచ్చిరి వారిఁగూడి
రాసక్రీడ సలువఁగ ॥మేలుకో॥

మామగారి కబురవచ్చెను మానుగా బలరాముతోడ
మధురకు నరుగఁగనీవు ॥మేలుకో॥

ద్వారకాపురమందుఁ బదియాఱువేల రాజ కాంతలఁ
జేరి యానందింపనీవు ॥మేలుకో॥

పూడివాడవాసనీకుఁ బూజలు సేయంగ మానిపుంగవులు
విచ్చేసిరింక ॥మేలుకో॥

తెల్లవాఱెను మందమారుత మల్లన వీతెంచి నిదిగో
మెల్లఁగా మేల్కొనుముతండ్రీ ॥మేలుకో॥



శ్రీ భాష్యకారసమాజస్థాపకులైన

మొవ్వ వేంకటదాసుగారిచే రచింపబడిన

## గ్రంథములు

| | |
|---|---|
| గోపికా విలాసము | 1—8—0 |
| సీతారామ ప్రభావము | 1—4—0 |
| లక్ష్మీ స్తవము | 1—0—0 |
| వరవరముని హృదయము | 0—12—0 |
| భాగవత సురభూజము | 1—0—0 |

నా గ్రంథములు:

కావ్యకళ—

భారతిగానము—

మొవ్వ దాశరథిసూరి
పూడివాడ
(వయా) పొన్నూరు,
గుంటూరు జిల్లా.

